Bachchonki Mazdoori Aur Islam
(Telugu)

# బాలశ్రామికులు

మూలం
సుల్తాన్ అహ్మద్ ఇస్లాహి

అనువాదం
అబ్దుల్ వాహెద్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# బాలశ్రామికులు

## భారతదేశంలో బాలశ్రామికులు

ప్రస్తుత కాలంలో కొనసాగుతున్న దౌర్జన్యాలలో చైల్డ్ లేబర్ (బాలల కాయకష్టం) కూడా ఒకటి. అసంఖ్యాక బాలలు తమ శక్తికి మించిన పని చేయక తప్పని నిస్సహాయ స్థితిలో ఉన్నారు. ఫలితంగా ఈ పసిమొగ్గలు వికసించక ముందే వాడిపోతున్నాయి. జీవితంలో ఆశలకు, ఆకాంక్షలకు దూరమై పరిస్థితుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడుతూ రాత్రింబవలు గడుపుతున్నారు. ఏదో విధంగా జీవితాన్ని నెడుతున్నారు. వారికి జీవితం ఓ ఖైదు. ఈ జీవన బందీ ఖానాలో వ్యక్తిత్వ వికాసం, అభివృద్ధి అన్నవి దూరం. ఒక్కోసారి వీరికి జీవితమే దూరం అవుతుంది. బ్రతికి ఉన్నప్పటికీ ఈ జీవితాన్ని బ్రతకాలా? చావాలా? అన్నది అర్థం కాని పరిస్థితిలో బ్రతుకు గడుపుతారు.

భారత సంవిధానంలో మౌలిక హక్కుల ప్రకరణంలో దౌర్జన్యాన్ని నిరోధించే హక్కు (Right, against exploitation) క్రింద పద్నాలుగు సంవత్సరాల కన్నా తక్కువ వయస్సు పిల్లలు ఫ్యాక్టరీలలో, కర్మాగారాలలో ఇతర స్థలాల్లో పనిచేయడాన్ని నిషేధించారు.* ఇదే విధంగా భారత ప్రభుత్వం 1959లో చేసిన బాలల హక్కుల ప్రకటన (Declaration of the Rights of Child 1959)లో విద్య, ఆరోగ్యం, వసతి, దౌర్జన్యం దురాగతాలనుంచి రక్షణలు పొందడం, ప్రత్యేక పేరు, జాతీయత, స్వేచ్ఛ, గౌరవంగల వాతావరణంలో పెరగడం ప్రతి పిల్లవాని మౌలిక హక్కుగా ఆమోదించింది. కాని రాజ్యాంగ హామీలు, చట్టపరమైన రక్షణలు ఉన్నప్పటికీ బలహీనులు, నిరాశ్రయులు అయిన

* India's Constitution .

పిల్లలు పెద్ద సంఖ్యలో ప్రమాదంతో కూడిన శ్రమ, పనులు చేయక తప్పడం లేదు. ఇదేమి రహస్యం కాదు. ఇది ఓ బహిరంగ చేదు నిజం. పత్రికలు చదివే వారు, సామాజిక చైతన్యం గల ప్రతి వ్యక్తికి తెలిసిన విషయమే. ఈ విషయమై మేము ప్రత్యేకంగా ఇండియన్ ఎక్స్‌ప్రెస్ - ఢిల్లీని ఉటంకించదలిచాము. ఎందుకంటే ఈ పత్రిక ఇలాంటి రుగ్మతలను ప్రజల దృష్టికి తీసుకురావడంలో అధిక ఆసక్తిని ప్రదర్శించింది.

ఈ పత్రిక 5 జులై 1980 నాటి సంచికలో అంతర్జాతీయ లేబర్ ఆర్గనైజేషన్‌ను ఉటంకిస్తూ క్రింది రిపోర్టును ప్రచురించింది. శివకాశికి దక్షిణాన ఉన్న ఊళ్ళలోని అగ్గిపెట్టెల కార్మాగారాల్లో దాదాపు 28వేల మంది పిల్లలు కేవలం మామూలు వేతనంపై రోజుకు 16 గంటలు పనిచేస్తున్నారు. ఇందులో అనేక మంది పిల్లల వయస్సు కేవలం ఐదేళ్ళు.

ఈ ఆర్గనైజేషన్ మరో రిపోర్టును వెలువరించింది. మేఘాలయలోని ప్రైవేటు గనుల్లో పెద్ద సంఖ్యలో పిల్లలు పనిచేస్తున్నారు. ఈ గనుల లోపలి పిల్లలు 90 సెంటీమీటర్ల వెడల్పు ఓ మీటరు పొడవుగల సొరంగాలలో పని చేయవలసి ఉంటుంది. పిల్లలు ఆ సొరంగంలో పట్టలేని సైజుకు పెరిగితే వారిని పని నుంచి తీసి పారేస్తారు. ఆర్గనైజేషన్ రిపోర్టు వివరాలతో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఏప్రిల్ 1979లో ప్రచురితమైంది.[1]

అదే పత్రికలో 3 డిసెంబరు 1980లో ప్రచురితమైన ఓ నివేదిక ప్రకారం భారత దేశంలో 90 శాతం పిల్లలు పోషకాహార లోపానికి గురవుతున్నారు. ఫలితంగా, ప్రతి నెల లక్షమంది పిల్లలు మరణిస్తున్నారు. దాదాపు మూడు కోట్ల మంది పిల్లలు ప్రమాదకరమైన, అనారోగ్యకరమైన పరిస్థితులలో రోజుకు 11 గంటల నుంచి 12 గంటల వరకు పనిచేయక తప్పడం లేదు. శివకాశిలో 40 వేల మంది పిల్లలు బాల శ్రామికులుగా పనిచేస్తున్నారు. వీరిలో అధిక శాతం పిల్లలు 4 నుంచి 5 ఏళ్ళ లోపు వయసులో ఉన్నారు.[2]

---

1. పైన పేర్కొన్న పత్రికలో శీర్షిక : Apathy at the top
2. పైన పేర్కొన్న పత్రికలో శీర్షిక : A matter of Shame

ప్రస్తుత కాలంలో 'మానవ హక్కులు' గురించిన చర్చ ఉధృతంగా జరుగుతూంది. ప్రపంచంలో ప్రతి మూలా ఈ చర్చ ప్రతిధ్వనిస్తూంది. బలహీన వర్గాల వారిని పైకి లాగడానికి, వారి పరిస్థితిని మెరుగుపరచడానికి గాను వాటి పేర ఓ సంవత్సరాన్నే జరుపుకున్నాము. కొన్నేళ్ళ క్రితం 1979ని అంతర్జాతీయ బాలల సంవత్సరం (International Year of the Child)గా జరుపుకొన్నాం. మన భారత దేశం కూడా మానవ హక్కులను దృఢంగా సమర్థి స్తుంది. ఇలాంటి సంక్షేమ కార్యకలాపాల్లో పూర్తి ఉత్సాహంతో పాల్గొంటుంది. ఇలాంటి కార్యకలాపాల్లో సహాయ మందించడానికి ఎల్లప్పుడు ముందుంటుంది. కాని, దేశంలో వాస్తవ పరిస్థితి ఎలా ఉందో వేరే చెప్పనక్కర లేదు. పైన పేర్కొన్న నివేదికలే చాలు. దేశంలో అనేక మంది పిల్లలు భిక్షాటన మొదలు కాయకష్టం వరకు నానా విధాల అణచివేతల క్రింద నిస్సహాయంగా అలమటిస్తున్నారు. భారతదేశంలో మాత్రమే ఈ సమస్యలేదు. ప్రపంచంలో అనేక దేశాల పరిస్థితి ఇలానే ఉంది.*

## బాలల శ్రమ వల్ల నష్టాలు

పిల్లలు శ్రమించడం వల్ల ఎదురయ్యే తీవ్ర పరిస్థితులు ప్రతి వ్యక్తికి కొద్దో గొప్పో తెలుసు. ఆ నష్టాలలో కొన్ని :

1. అన్నింటికన్నా ముందు ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం పడుతుంది. పిన్న వయస్సులో, అధిక శ్రమవల్ల పిల్లల్లో పెరుగుదల, వికాసం దెబ్బతిని వాళ్ళు కృశించిపోతారు. పిల్లలు ప్రమాదకర వ్యాధులకు గురై మరణించడం కూడా తరచూ సంభవిస్తుంది. బ్రతికి ఉన్నప్పటికీ వికలాంగుల్లా, నిస్సహాయుల్లా సమాజానికి భారంగా బ్రతుకుతారు.

---

★ ఈ పత్రికలోనే 8 జూన్ 1981లో ప్రచురితమైన వార్త ప్రకారం థాయ్‌లాండ్ లో బాలలు లక్షలాది మంది అత్యంత దయనీయ స్థితిలో కాయకష్టం చేయకతప్పని స్థితిలో పడివున్నారు. ఈ బాలశ్రామికుల సంఖ్య నానాటికి పెరుగుతుంది. Exploitation of Child Labour in Thailand.

2. మరో పెద్దనష్టం ఏమంటే పెద్ద సంఖ్యలో పిల్లలు విద్యా శిక్షణలు పొందలేరు. బాల్యదశ వ్యక్తిత్వ నిర్మాణ దశ. అలాటి దశలో వికాసం దెబ్బతింటే చివరికి వ్యక్తిత్వ నిర్మాణం బలహీనంగా ఉండి పోతుంది. బాల్య దశలో పిల్లలు విద్యా శిక్షణలను పొందలేక పోతే, వారిని కాయకష్టపు పనుల్లో నెట్టివేస్తే అలాటి జాతి చివరికి ఏమవుతుంది? ఆ జాతి విద్యాహీనులు, సంస్కార రహితులు అయిన వ్యక్తులతో నిండిపోతుంది. అలాంటి జాతి అటుదైవం వద్ద, ఇటు ప్రపంచం లోనూ అవమానాలకు గురికాక తప్పదు.

3. పిల్లలు విద్యా శిక్షణలు పొందలేకపోవడం అన్నది కేవలం వారికి లోటు మాత్రమే నష్టం కాదు. ఆ పిల్లల తల్లిదండ్రులు, బంధువులకు మాత్రమే లోటుకాదు, అది వాస్తవానికి ఆ జాతికే పెద్దలోటు. ఏ జాతికైనా సరే అసలు పెట్టుబడి ఆ జాతి లోని ప్రజలే. ప్రజలు గనుక విద్యావంతులు, సంస్కారవంతులు అయినట్లయితే ఆ జాతి ప్రతిష్ఠను అత్యున్నత స్థాయికి చేర్చగలరు. కాని, ప్రజలు ఏ కారణం వల్లనైనా అసమర్థులుగా మారినట్లయితే వారెన్ని ప్రయత్నాలు చేసినా ఆ జాతికి భూమండలం ఇరుకుగానే ఉంటుంది. నేటి పిల్లలే పెరిగి రేపటి పౌరులవుతారు. జాతి ప్రతిష్ట వారి మీదనే ఆధారపడి ఉంటుంది. పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పి తద్వారా రేపటి దేశ పౌరులను తీర్చిదిద్ది దేశ వికాసానికి ఏర్పాట్లు చేయడం ప్రధానమా? లేక అందుకు భిన్నంగా ఆ పసి మొగ్గలను చిన్నప్పటి నుంచి కష్టాల బండరాళ్ళను మోయమని, రేపటి దేశపౌరుల వికాసానికి అడ్డుపడి దేశ భవిష్యత్తును ధ్వంసం చేయడం ఉచితమా? -

4. బాలల శ్రమ వల్ల వాటిల్లే ఈ నష్టాలే కాక మరో మానసిక నష్టం కూడా ఉంది. పై నష్టాలకన్నా ఇది మరింత భయానకమైనది పిల్లలను పెద్ద సంఖ్యలో కార్మికులుగా మార్చడం వల్ల జాతిలో వ్యక్తిత్వ వికాసం మందగించిన వారి సంఖ్య అత్యధికంగా పెరుగుతుంది. బాలశ్రామికులు ఎల్లప్పుడు పిల్లలుగానే ఉండిపోరు. వారు పెరుగుతున్నకొద్దీ, వారిలో చైతన్యం పెరుగుతున్న కొద్దీ వారికి తాము పోగొట్టుకొన్నదేదో, తమకేది నిరాకరించబడిందో తెలియవస్తుంది. ఓ వైపు సంతోషప్రద జీవితాన్ని గడుపుతున్న వారి ప్రపంచాన్ని చూస్తారు. మరోవైపు దుఃఖం, బాధలు, సమస్యలు చుట్టుముట్టిన తమ జీవితాలను చూసుకొంటారు.

అణచివేతకు గురయ్యామన్న నిస్పృహతో వారిలో ఆగ్రహం పెల్లుబికితే జరిగే విధ్వంసం ఎంతటి నష్టాన్ని తెస్తుందో ఎవరూ ఊహించలేరు.

ప్రపంచంలో కమ్యూనిజం, సోషలిజం లాంటి అతివాద సిద్ధాంతాలు ఉనికిలోకి రావడానికి కారణం ఇదే. వర్గద్వేషం, పగ, బలప్రయోగం, ఉద్రిక్తల ఓ ఆరని అగ్నిగుండంలోకి మానవాళిని నెట్టివేశాయా సిద్ధాంతాలు.

## ఇస్లామీయ దృక్పథం

ఈ నేపథ్యంలో మనం ఇస్లామీయ బోధనలను అధ్యయనం చేస్తే ఈ బోధనలలోని ఔచిత్యాన్ని, సమతుల్యాన్ని చూసి ఆశ్చర్య చకితులు కాక తప్పదు. నేటికి 1400 సంవత్సరాలకు పూర్వం ఇస్లాం ఏ విధంగా ఈ సమస్యకు పరిష్కారాన్ని ప్రతిపాదించిందో, తెలుసుకొని ఆహా! అనకా తప్పదు. పిల్లలను కార్మికులుగా మార్చి వారిపై దౌర్జన్యానికి అత్యాచారానికి పాల్పడే నేటి దిగజారిన పరిస్థితులకు కారణాలు, వాటి నివారణకు గాను తీసుకోవలసిన సమస్త చర్యలు సూచిస్తూ ఈ సమస్యకు వివిధ రూపాలను ఒక్కొక్కటిగా అంతమొందిం చింది ఇస్లాం. ఇదంతా చదివిన ఏ వ్యక్తయినా సరే ఈ చమత్కారం మనిషికి సాధ్యం కాదని, కేవలం ఆ అత్యున్నత దైవం ప్రసాదించిన వివేకం, వివేచన నిండి ఉన్న జీవన విధానం ఇదని అంగీకరించక తప్పదు. అంతేకాదు ప్రళయం వరకు ఈ వ్యవస్థలో పరిష్కారం సూచించబడని సమస్య అంటూ ఏదీ తలెత్తబోదు.

**ఇస్లాం పిల్లలను నిస్సహాయులుగా పేర్కొని ఆ బలహీన వర్గం పట్ల శ్రద్ధ చూపాలని ప్రోత్సహించింది.**

మనిషి బుద్ధి వివేకాలు, ఆలోచనలు అనేక శతాబ్దాలుగా ఎన్నెన్నో మజిలీలను దాటి చివరకు నేటికి బాలల సంక్షేమం (Child Welfare) గురించి శ్రద్ధ వహించాలన్న నిర్ణయానికి వచ్చాయి. కాగా, ఇస్లామీయ సంవిధానం, ఖుర్‌ఆన్ నేటికి 1400 సంవత్సరాలకు పూర్వమే బాలల సంక్షేమం గురించి ప్రస్తావించింది. ప్రపంచంలో బాలలను నిస్సహాయులుగా పేర్కొంటు వారిని బలహీన వర్గంగా గుర్తించిన మొట్టమొదటి గ్రంథం బహుశా ఖుర్‌ఆన్ మాత్రమే.

**"నిస్సహాయులై బయటపడేదారికి ఏ మార్గమూ, సాధనా సంపత్తులూ లేని పురుషుల్ని, స్త్రీలను, పిల్లల్ని అల్లాహ్ క్షమించడం సంభవమే."**

**(అన్‌నిసా : 98)**

అంతేకాదు దౌర్జన్యాలు, అత్యాచారాల కబంధ హస్తాల నుంచి విముక్తి పొందడానికి గాను పోరాడాలని కూడా ఆదేశాన్నిస్తుంది ఇస్లాం.

**"అల్లాహ్ మార్గంలో మీరు, నిస్సహాయులైన ఆ పురుషులు, స్త్రీలు పిల్లల కొరకు పోరాడకపోవడానికి కారణం ఏమిటి? బలహీనులవడం చేత అణచబడి వారు "ప్రభూ! దుర్మార్గులు ఉండే ఈ నగరం నుంచి మాకు విమోచనం కలిగించు. మా కొరకు నీ తరఫు నుండి ఒక సహాయకుణ్ణి పంపించు అని ఫిర్యాదు చేస్తున్నారే!"** **(అన్‌నిసా - 75)**

# పిల్లల గురించిన ఇస్లామీయ విధానం

## కరుణను పొందడం పిల్లల హక్కు

పిల్లల విషయంలో ఇస్లామీయ విధానం ఏమిటి? పిల్లలను ఇస్లాం ఏ దృష్టితో చూస్తుంది? అన్న ప్రశ్నలకు సవివరమైన సమాధానం ఏమంటే: ఇస్లాంలో పిల్లలు దౌర్జన్యాలకు అత్యాచారాలకు గురయ్యే ప్రసక్తే లేదు. పిల్లలు అంటే ఇస్లాంలో వెలకట్టలేని అమూల్య సంపద. జాతి పురోభివృద్ధికి పెట్టుబడి. వారితో మృదువుగా ప్రేమతో వ్యవహరించాలి. అలాంటి వ్యవహారశైలిని పొందడం పిల్లల హక్కు. దౌర్జన్యానికి, అత్యాచారాలకు గురి కాకుండా పిల్లలను రక్షించాలి.

ప్రియప్రవక్త సల్లాల్లాహు అలైహి వ సల్లం ఈ విషయమై ఇలా సెలవిచ్చారు :

**"పిన్నలపై కరుణ చూపని వారు, పెద్దల హక్కులను నెరవేర్చని వారు మాలోని వారు కాదు."***

---

★ అబూదావూద్, సంపుటి-2; తిర్మిజి, సంపుటి-2.

ఇదే విధంగా పవిత్ర ఖుర్ఆన్ కూడా పిల్లల పట్ల కరుణ, దయలతో వ్యవహరించాలని ప్రోత్సహించింది. ఈ విషయమై ఖుర్ఆన్ మనిషి సహజ మనస్తత్వానికి అనుగుణమైన విధంగా బోధించింది. మనిషి తన పిల్లల పట్ల ఏ విధంగా వ్యవహరిస్తాడో అదే విధంగా సమాజంలోని ఇతర పిల్లల పట్ల కూడా వ్యవహరించాలి.

**"సతతం నీరుపారే పిల్లకాలువలతో, ఖర్జూరం,ద్రాక్ష మొదలైన సకల ఫల సంభరితమై పచ్చగా అలారారే తోట మీలో ఎవరికైనా ఉండి, అతడు వయోభారంతో కృంగి, సంపాదనాపరులు కాని చిన్న పిల్లలు ఉన్న అతి నాజూకు తరుణంలో, ఆ తోట తీవ్రమైన వడగాడ్పులకు గురి అయి మాడిపోవడం మీలో ఎవరికైనా సమ్మతమా? మీరు యోచించగలందుకు ఈ విధంగా అల్లాహ్ తన హితవులను విశదపరుస్తాడు."**

**(అల్ బఖర-266)**

మరణానంతరం తన పిల్లలు భద్రతారాహిత్య స్థితిలో అలమటించినా ఫర్వాలేదనుకొనే వ్యక్తి ఎవరూ ఉండడు. ఇదే విషయాన్ని ఖుర్ఆన్ సూచిస్తుంది. మీరు మీ పిల్లల విషయంలో ఇలా జరగడాన్ని భరించలేనట్లే సమాజంలోని నిస్సహాయులైన పిల్లలకు, అలా జరగడాన్ని సహించరాదు. వారసత్వానికి సంబంధించిన ఆఖరి ఆదేశాలు రాకముందు ఇస్లాం మృతుని ఆస్తిలో బంధువులతోపాటు సాధారణ సంబంధీకులకు, సమాజంలోని అనాధలకు, నిరుపేదలకు కూడా అందులో హక్కు ఉందని నిర్దేశించింది. ఈ సందర్భంగా ఖుర్ఆన్ పిల్లల పట్ల మన వ్యవహారశైలిలో కరుణ దయలు ఇలా ఉండాలని సూచిస్తుంది.

**"ఆస్తి పంపకం జరిగేటప్పుడు ఇతర కుటుంబీకులు, అనాధలు నిరుపేదలు వస్తే, ఆ ఆస్తి నుండి వారికి కూడా కొంతయివ్వండి. వారిని మంచి మాటలతో పలకరించండి.**

**ప్రజలు ఈ విషయాన్ని ఆలోచించిభయపడాలి. ఒకవేళ వారే స్వయంగా నిస్సహాయులైన పిల్లల్ని విడిచి ఉన్నట్లయితే, మృత్యు సమయంలో వారికి తమ పిల్లల గురించి ఎంత ఆందోళన కలిగి ఉండేది! కనుక వారు అల్లాహ్‌కు భయపడాలి. న్యాయం పలకాలి." (అన్నిసా-8,9)**

# శక్తికి మించిన పని చేయించడం నిషిద్ధం

ఇస్లాం ఓ వైపు పిల్లలతో ప్రేమతో, మృదువుగా వ్యవహరించాలని నిర్దేశిస్తూ వారి పట్ల ప్రేమ, దయ, కరుణ చూపాలని ప్రజలను ప్రోత్సహించింది. మరో ప్రక్క ఇస్లాం పిల్లల చేత ప్రమాదకరమైన పనులుకాదు సరికదా శక్తికి మించిన పనులు కూడా చేయించే వీలులేదని కట్టడి చేసింది. ఏ మనిషితోనయినా సరే శక్తికి మించిన పని చేయించరాదన్నది ఇస్లాంలోని మౌలిక నియమం.

**"ఏ మనిషిపైననూ అతడు చేయగలిగినంత తప్ప అధిక భారం వేసే వీలు లేదు."** **(అల్ బఖర : 233)**

ఏడేళ్ళ పిల్లవాడితో బొగ్గు గనుల్లో పనిచేయించడం, ఆ పిల్లవాని శక్తికిమించిన పని కాదని ఎవరన్నా అనగలరా?

ఇదే విధంగా ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం కూడా బానిసలు, నౌకర్ల గురించి చెబుతూ వారితో శక్తికి మించినపని చేయించరాదని అన్నారు. బానిసలతో కూడా శక్తికి మించిన పని చేయించే అవకాశం అసలు లేనే లేదు.

ఈ విషయమై ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ప్రవచనాలను హజ్రత్ అబూహురైరా (రజి) ఇలా ఉల్లేఖించారు.

**"అన్న వస్త్రాలను పొందడం నౌకరు హక్కు, అతడిపై అతడుచేయగలిగి నంత పని భారం మాత్రమే వేయాలి."**

పిల్లలను కార్మికులుగా మార్చడం వల్ల వాటిల్లే మరోనష్టం ఏమంటే పిల్లల అలవాట్లు, నైతికత వక్ర మార్గం పట్టే అవకాశం ఉంది. ఈ కోణంలో కూడా ఇస్లాం బాలల శ్రమను నిషేధించింది. పసివయసులో ఉన్న బానిస గురించి ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం ఇలా తాకీదు చేశారు.

**"పసివాని (బానిస)పై సంపాదనా భారం వేయవద్దు. ఎందుకంటే అతడు సంపాదించలేకపోతే దొంగతనం చేయనారంభిస్తాడు."***

---

★ మూతా, భాగం: 2; కితాబుల్ జామిఅ.

# ప్రమాదకరమైన పనులు నిషిద్ధం

ఇంతకు ముందుచెప్పినట్లే పిల్లలతో శ్రామికుల్లా పనిచేయించడం వల్ల వారి ఆరోగ్యం దెబ్బతింటుంది. ఒక్కోసారి భయానక వ్యాధులకూ గురి అయ్యే అవకాశం ఉంది. ఆ వ్యాధులు పిల్లల ప్రాణాలనే కబళించవచ్చు.

ఒకవేళ బ్రతికి ఉన్నప్పటికీ నిస్సహాయ జీవితాన్ని గడుపుతూ జీవితాంతం వరకు సమాజానికి భారంగా బ్రతుకుతారు. ఈ తీవ్ర, విషమ పరిస్థితిని ప్రతి మనిషి అంచనా వేయగలడు. ఇస్లాం ప్రపంచంలో న్యాయాన్ని, ధర్మాన్ని స్థాపించే జీవన వ్యవస్థ. ప్రతి మనిషికి అతడి హక్కును లభ్యమయ్యేలా చేయడానికి వచ్చింది. అందువల్ల ఎవరి ప్రయోజనాల (ధార్మికత)నైనా సరే దెబ్బతీసే అన్ని విధాల చర్యలు ఇస్లాంలో నిషిద్ధం. ఈ విషయమై ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా హెచ్చరించారు :

**"ఎవరికీ (ఇతరులకు) నష్టం కలుగరాదు. (మనలో) ఒకరికొకరు నష్టం కలుగజేయరాదు."[1]**

ఇదే విధంగా ప్రవక్త ప్రవచనం మరొకటి ఇలా ఉంది.

**"ఇతరులకు నష్టం కలుగజేయాలనుకొనే వాడిని దైవం నష్టపరుస్తాడు. అలాగే అకారణంగా ఇతరులతో శత్రుత్వం చూపే వాడితో అల్లాహ్ శత్రుత్వం వహిస్తాడు."[2]**

పసితనంలో కష్టతరమైన పనులు చేయడం వల్ల పిల్లల ఆరోగ్యానికి వాటిల్లే తీవ్ర నష్టాన్ని మించిన నష్టాము మరేదీ లేదు. ఇలా చేయడాన్ని ఇస్లాం ఎన్నటికీ అనుమతించే ప్రసక్తేలేదు.

---

1. మూతా : భాగం-2.
2. తిర్మిజి : భాగం-2.

# వయోపరిమితి

ఈ విషయంలో ఇస్లాం వయోపరిమితిని కూడా నిర్ధారించింది. నిర్ధారిత వయస్సుకన్నా తక్కువ ప్రాయంలో ఉన్న పిల్లల పట్ల సమాజం సానుభూతి, ప్రేమాభిమానాలు, దయా కరుణలతో వ్యవహరించాలి. అలాంటి ఆదరణ పొందడం పిల్లల హక్కు. అంతేతప్ప పిల్లల శక్తిహీనతను నిస్సహాయ స్థితిని సొంతప్రయోజనాలకు వాడుకోవడం, పిల్లల చేత శక్తికి మించిన ప్రమాదకర పనులు చేయించడం ఎంత మాత్రం తగదు. ఏ వయస్సు వరకు పిల్లలుగా పరిగణించగలం అన్న ప్రశ్నకు ఖుర్ఆన్ స్వయంగా జవాచ్చింది. లైంగిక భావాలు జన్మించనంత కాలం, ఆ యుక్త వయస్సు వరకు పిల్లలుగానే లెక్క. లైంగిక సంబంధం అంటే ఎరుగని వయస్సు వరకు పిల్లలే.

**"పిల్లలు, స్త్రీల రహస్యాలు ఎరుగని వారు." (నూర్ - 31)**

ఇదే విధంగా ఆ తరువాత పిల్లలు ఎవరో నిర్ధారిస్తూ వ్యవహారజ్ఞానం తెలియని వయస్సు గలవారు పిల్లలని పేర్కొంది. వారిపై సామాజిక బాధ్యతలు ఉండవు.

**"మీలో పిల్లలు (వ్యవహారాలను) అర్థం చేసుకొనే వయస్సుకు చేరినప్పుడు వాళ్ళు (ఇంటిలోకి ప్రవేశించేముందు) అనుమతిని పొందాలి."**

"నేటి ఆధునికులు ఎన్ని ఆలోచనలు చేసి 14 ఏళ్ళ ప్రాయం లోపు ఉంటే బాలలుగా నిర్ధారించారో గాని ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ఈ నిర్ధారణను నేటికి 14 వందల సంవత్సరాలకు పూర్వమే చేశారు. హజ్రత్ నాఫె అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఈ విధంగా వివరించారు: ఉహుద్ యుద్ధం సందర్భంగా హజ్రత్ ఉమర్ (రజి), అబ్దుల్లా (రజి)ని సైన్యంలో భర్తీ చేయడానికి ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ముందుకు తెచ్చినప్పుడు అబ్దుల్లా (రజి) వయస్సు కేవలం 14 ఏళ్ళు ఉంది. అందువల్ల ప్రవక్త (సఅసం) ఆయన్ను సైన్యంలో చేరడానికి అర్హతలేదని అన్నారు. అయితే ఆ తరువాత ఒక సంవత్సరం గడచిన పిదప, కందక యుద్ధం సందర్భంగా హజ్రత్ ఉమర్ (రజి) మళ్ళీ నాఫె అబ్దుల్లాను సైన్యంలో భర్తీ చేయడానికి తీసుకొచ్చినప్పుడు నాఫె వయస్సు 15 సంవత్సరాలు ఉంది. అప్పుడు

మహాప్రవక్త ముహమ్మద్ (స) ఆయనను సైన్యంలో చేరడానికి, వేతనం పొందడానికి అర్హత ఉందని తీసుకున్నారు. హజ్రత్ నాఫె అబ్దుల్లా ఇంకా ఇలా వివరించారు: హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రజి) ఖలీఫాగా ఉన్న ప్పుడు నాఫె (రజి) ఓసారి ఆయన వద్దకు వెళ్ళడం సంభవించింది. అప్పుడు నాఫె (రజి) ప్రవక్త (స) మాటలను అబ్దుల్ అజీజ్ (రజి)కి వినిపించినప్పుడు ఖలీఫా అజీజ్ (రజి) ఇలా అన్నారు:

"బాల్యాన్ని, యుక్తప్రాయాన్ని వేరుపరిచే ఖచ్చితమైన అవధి" అది అని జవాబిచ్చారు.[1] అంతేకాదు. ఆ వెంటనే తన గవర్నర్లకు ఓ ఫర్మానా పంపుతూ 15 ఏళ్ళకు పైబడిన వారిని మాత్రమే సైన్యంలో భర్తీ చేయవచ్చని వారికి వేతనాలు జారీ చేయాలని ఆదేశాలు జారీ చేసారు.

"15 ఏళ్ళ వయస్సు ఉన్న వారికి సైనిక సేవల వేతనం నిర్ణయించాలని కూడా ఆయన తన గవర్నర్లను ఆదేశించారు."[2]

## తల్లిదండ్రుల బాధ్యత

పిల్లల పెంపకానికి, పోషణకు, వికాసానికి ఓ అత్యున్నత వ్యవస్థను ఇస్లాం నెలకొల్పింది. ఏ ఒక్కపిల్లవాడు కూడా ఆ పసిప్రాయంలో ఆకలితో, కట్టుబట్టలేక ఉండరాదు. ఏదీ లభ్యం కాని నిస్సహాయ స్థితిలో గడపరాదు. నిస్సహాయ స్థితి వల్లనే పిల్లలు శ్రామికులుగా పనిచేయడానికి సిద్ధపడతారు. అందువల్ల ఈ విషయంలో ప్రథమంగా బాధ్యత తల్లిదండ్రుల మీద పడుతుంది. తల్లిదండ్రులు తమ పిల్లల ఖర్చుల్ని భరించాలి. పిల్లల ఖర్చులను భరించడం నైతికంగానే కాదు ఇస్లామీయ చట్టపరంగా కూడా తల్లిదండ్రుల బాధ్యత. ఇస్లామీయ ధర్మశాస్త్రం ఈ విషయమై ఇలా పేర్కొంది.

---

1. బుఖారి బాగం : 1 కితాబుష్షాహదాత్ బాజ్‌బులుగుల్ బయాన్‌వషహదతుమ్. అబూదావూద్ : భాగం :2; కితాబుల్ హుదూద్.
2. బుఖారి, భాగం:1 కితాబుష్షహాద్.

"పిల్లల ఖర్చులు తండ్రి భరించాలి. ఈ బాధ్యత నిర్వర్తించడంలో ఇతరులెవ్వరూ భాగస్వాములు కారు. భార్య ఖర్చుల బాధ్యత భర్త వహించడంలో ఎలా అయితే ఇతరులెవ్వరూ భాగస్వాములు కాలేరో అదే విధంగా ఇక్కడానూ."[1]

తల్లిదండ్రులు లేని పిల్లలు, లేక మరే కారణం వల్లనైనా నిస్సహాయ స్థితిలో ఉన్న పిల్లల విషయంలో వారి పోషణ బాధ్యత సమీప బంధువులపై పడుతుంది.

"పసిప్రాయంలో ఉన్న లేదా బీదవాడైనా లేదా నిస్సహాయ స్థితిలో ఉన్న స్త్రీ లేదా నిస్సహాయ స్థితిలో ఉన్న పురుషుడు లేదా వ్యాధిగ్రస్తుడు లేదా అంధులు అయి ఉన్న రక్త సంబంధీకుని పోషణ భరించడం సమీప బంధువుల బాధ్యత.[2]

ఇది కూడా కేవలం నైతిక బాధ్యత కాదు. చట్టపరమైన కర్తవ్యం. అందువల్ల ఈ బాధ్యత నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించిన వారి ఆటలను ఇస్లామీయ ప్రభుత్వం అరికడుతుంది.

"వారసత్వ పంపకాలకు అనుగుణంగా ఈ బాధ్యత మనిషిపై పడుతుంది. ఈ బాధ్యతను వ్యక్తులు నెరవేర్చేలా ఒత్తిడి చేయడం జరుగుతుంది.[3]

## సమాజ బాధ్యత

సమాజంలో ప్రతి పిల్లవానికి తల్లిదండ్రులు ఉండాలని లేదు. పోషణ బాధ్యతను వహించే సమీప బంధువులు కూడా ఉండని పిల్లలు ఉండవచ్చు. ఇలాంటి పిల్లలు ప్రతి సమాజంలోనూ ఉంటారు. తల్లిదండ్రుల నీడ లేనందువల్ల, కనీసం పోషించే సమీప బంధువులన్నా లేకపోబట్టి అనాధలుగా, నిస్సహాయులుగా బ్రతుకు గడవని పిల్లలు అనేకులు ఉంటారు. ఇలాంటి పిల్లలే పసి ప్రాయంలో ఆడేపాడే వయస్సులో శక్తికి మించిన ప్రమాదకర పనులను చేసి పొట్టపోసుకోవలసి వస్తుంది. అంతే తప్ప ఏ తండ్రీ తన పిల్లలను గనుల్లో, ఫ్యాక్టరీల్లో ప్రమాదకరమైన

1. హిదాయ - పేజీ 424.
2. హిదాయ - పేజీ 426.
3. హిదాయ - పేజీ 427.

పనులు చేయడానికి పంపడు. పంపలేడు. అనాథపిల్లల విషయంలో ఖుర్‌ఆన్ స్పష్టంగా ఆదేశించింది. అనాథలు, నీడలేని వారు అయిన పిల్లలపై దౌర్జన్యాలు, అత్యాచారాలకు పాల్పడరాదని కఠినంగా నిరోధించింది. అంతేకాదు అలాంటి పిల్లల సంరక్షణకు, సంక్షేమానికి కృషిచేయాలి. అలాంటి పిల్లల ప్రయోజనాలను కాపాడాలి.

**"యతీం' (తండ్రిలేని పిల్లలు)లతో వ్యవహరించే తీరును గురించి వారు నిన్ను అడుగుతారు. నీవు వారికి బోధించు. 'ఏ విధంగా వ్యవహరిస్తే వారికి ఎక్కువ మేలు కలుగుతుందో, ఆ విధంగా వ్యవహరించటం ఉత్తమం. ఒకవేళ మీరూ వారు కలసి ఉంటూ ఉభయులూ ఖర్చుల్ని ఉమ్మడిగా ఉంచుకుంటే అందులో అభ్యంతరం లేదు. ఎటొచ్చి వారు మీకు సోదరతుల్యులేగా కీడు చేసేవారెవరో మేలు చేసేవారెవరో అల్లాహ్‌కు బాగా తెలుసు." (అల్ బఖర - 220)**

అనాధ పిల్లలను వాళ్ళు యుక్త వయస్సుకు వచ్చే వరకు సంరక్షణ కొనసాగాలి. అంటే వాళ్ళు పెళ్ళీడుకు వచ్చే వరకు వారికి వ్యవహారాలు అర్థమయ్యే వయస్సు వచ్చే వరకు అన్నమాట.

**"అల్లాహ్ మీ కొరకు ఏ సొమ్మునయితే జీవనాధారంగా చేసాడో దాన్ని అవివేకులకు అప్పగించవద్దు. అయితే దాన్నుంచి వారికి అన్న వస్త్రాలను ఇవ్వండి. వారికి హితబోధ చెయ్యండి. అనాధలు పెళ్ళీడుకు వచ్చే వరకు వారిని పరీక్షిస్తూ ఉండండి. వారు యోగ్యులయ్యారని మీరు భావించినపుడు వారి ఆస్తిని వారికి అప్పగించండి. వారు పెద్దవారై తమ హక్కును అడుగుతారేమోనని వారి ఆస్తిని న్యాయ పరిధుల్ని అతిక్రమించి, త్వరత్వరగా ఎన్నటికీ తినకండి. అనాధల సంరక్షకుడు సంపన్నుడైతే అతడు వారి సొమ్ముకు దూరంగా ఉండాలి. పేదవాడైతే దాన్ని ధర్మసమ్మతంగా అనుభవించాలి. తరువాత వారి ఆస్తిని వారికి అప్పగించేటప్పుడు ఇతరుల్ని దానికి సాక్షులుగా పెట్టండి. లెఖ్ఖతీసుకోడానికి అల్లాహ్ చాలు." (అన్ నిసా :1-5,6)**

ఖుర్ఆన్‌లో 28 చోట్ల అనాధలు, దీనుల హక్కులను నిర్వర్తించడాన్ని, వారి పోషణ సంరక్షణకు ఆదేశించింది. అదే విధంగా ప్రవక్త ముహమ్మద్ (స) లెక్కలేనన్ని హదీసుల్లో ఈ విధంగా బోధించారు. ఓ హదీసులో ప్రవక్త(స) ఇలా ఉపదేశించారు. "అనాధల పోషణ భారాన్ని మోస్తున్నవారూ, నేను స్వర్గంలో ఇలా ఉంటాము - అంటూ ఆయన చూపుడు వ్రేలు, మధ్యవ్రేలు కలిపి చూపించారు.[1]

ఇదేవిధంగా మరో హదీసులో దీనులను ఆదుకోవడంలో ఆసక్తి చూపే వారిని గురించి చెబుతూ-

"వితంతువులు, దీనుల కోసం పాటుపడే వాడు దైవ మార్గంలో పోరాడే వాని వంటివాడు."[2]

కొందరి ప్రకారం అలసట ఎరుగక నఫిల్ నమాజు చదివే వ్యక్తి వంటి వాడు, లేదా నిరంతరంగా ఉపవాసం ఉండే వ్యక్తి వంటివాడు.

ఇదే విధంగా హజ్రత్ అబూహురైరా (రజి) ఉటంకం ప్రకారం ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా అన్నారు :

"అనాధల పట్ల మృదువుగా వ్యవహరించేవారున్న ఇల్లు ముస్లింలలో అన్నింటి కన్నా ఉత్తమ గృహం. అనాధల పట్ల దౌర్జన్యంగా వ్యవహరించే వారున్న ఇల్లు నీచగృహం.[3]

## రాజ్య రక్షణ

ఇంకా నిస్సహాయులు, నీడలేని పిల్లలు సమాజంలో మిగిలి ఉంటే వారికి నీడనీయడం, వారి జీవితావసరాలకు అవసరమైన ఏర్పాట్లు చేయడం ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యత అవుతుంది. మనిషికి ఇహపరలోకాలు రెండింటా మార్గదర్శన మిచ్చే ధర్మం ఇస్లాం. ప్రజల ఇహపరాలోకాల ప్రయోజనాలను కాపాడడం ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యత. ఇస్లామీయ రాజ్యాధిపతి పదవి ఎలాంటిది?

---

1. బుఖారి, భాగం-2, కితాబుల్ అదబ్.
2. బుఖారి, భాగం-2, కితాబుల్ అదబ్.
3. ఇబ్నుమాజా, అబ్వాబుల్ అదబ్ బాబ్ హఖ్ఖుల్ యతీమ్.

సాధారణ ప్రజల పట్ల అతడి బాధ్యతలు ఏవి? అన్న విషయాన్ని ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం క్రింది హదీసులో వివరించారు.

"వినండి! మీలోని ప్రతి వ్యక్తి సంరక్షకుడు. ప్రతి వ్యక్తిని అతడి ఆశ్రితుల గురించి ప్రశ్నించడం జరుగుతుంది. సాధారణ ప్రజలపై అధికారం పొందిన నాయకుడు సంరక్షకుడు. అతడిని అతడి ప్రజల గురించి ప్రశ్నించడం జరుగుతుంది. పురుషుడు తన ఇంటి వారి సంరక్షకుడు. అతడిని అతడి కుటుంబ సభ్యుల గురించి ప్రశ్నించడం జరుగుతుంది. స్త్రీ తన భర్త ఇంటికి, అతడి పిల్లలకు సంరక్షకురాలు. ఆమెను అందుగ్గాను ప్రశ్నించడం జరుగుతుంది. అలాగే బానిస తన యజమాని సంపదకు సంరక్షకుడు అతడిని అందుగ్గాను ప్రశ్నించడం జరుగుతుంది. వినండి. మీలో ప్రతి వ్యక్తి సంరక్షకుడు. ప్రతి వ్యక్తిని అతడి ఆశ్రితుల గురించి ప్రశ్నించడం జరుగుతుంది.*

పశువుల కాపరి తన మందలోని ప్రతి ఒక్క పశువుకు సంరక్షకుడు. వాటి గురించి అతడికి జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. ఇస్లామీయ రాజ్యాధిపతి పరిస్థితి కూడా ఇలాంటిదే. రాజ్యంలోని చిన్నా, పెద్ద ప్రతి ఒక్క వ్యక్తి సంరక్షణ, పోషణ అతడి బాధ్యతలు, ఈ బాధ్యతల నిర్వహణలో నిర్లక్ష్యాన్ని చూపితే అతడు దైవం ముందు, ప్రజల ముందు జవాబీయక తప్పదు.

పైన పేర్కొన్న హదీసు సాధారణమైనది. ఈ హదీసులో ప్రజల పట్ల పాలకునికి గల బాధ్యతలు తెలియవచ్చాయి. అయితే ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ప్రవచనం మరొకటి ప్రత్యేకంగా ఉంటానికి ఇల్లులేని, పెద్దవారినీడలేని పిల్లల గురించి ఉంది. అలాంటి పిల్లల పోషణ బాధ్యత పాలకునిదేనని ప్రవక్త ప్రబోధించారు. ఇస్లామీయ రాజ్య ప్రథమ పాలకునిగా ఆయన ఇలా ప్రకటించారు:

"నేను ముస్లింలకు వారి కన్నా ఎక్కువగా సంరక్షించేవాడిని. ఎవరన్నా నా వద్ద సంపదను విడిచిపెడితే ఆ సంపద అతని బంధువులది. అలాగే ఎవరన్నా

★ బుఖారి–2వ భాగం.

పసి ప్రాయంలో ఉన్న సంతానాన్ని నిస్సహాయ స్థితిలో విడిచిపెడితే నేను వారికి సంరక్షకుడిని. వారి కోసం నన్ను పిలిస్తే చాలు."[1]

ఈ హదీసు వల్ల తెలిసేదేమంటే ఈ లక్షణం ప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ప్రత్యేకమైనది. ముస్లిం ధర్మవేత్తలలో దీనిని సమర్థించే వాళ్ళు అనేకులు ఉన్నారు. అయితే ఈ లక్షణం ప్రవక్త గారికే ప్రత్యేకం అవ్వడానికి ఏ కారణమూ కనబడడం లేదు. ఎందువల్లనంటే మానవ ప్రాణాలు ప్రతికాలంలోనూ మన్నించదగ్గవి. అందువల్ల అనాధలు, దీనులు ఏ కాలంలో అయినా సరే ఒక విధమైన సంరక్షణకు, పోషణకు, హక్కుదారులు. ధర్మవేత్తలనేకమంది ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నారు. హాఫిజ్ ఇబ్నె హాజర్ రహ్మతుల్లా అలైహ్ క్రింది హదీసు గురించి చెబుతూ-

"నేను ముస్లింలకు వారి కన్నా ఎక్కువగా సంరక్షించే వాడిని కాబట్టి ఎవరన్నా మరణించినపుడు అతడు ఎవరికన్నా రుణపడి ఉంటే, రుణాన్ని తీర్చడానికి పనికి వచ్చే వస్తువు ఏదీ అతడు విడిచి ఉండకపోతే, ఆ రుణాన్ని తీర్చడం నా బాధ్యత. అలాగే ఎవరన్నా సంపద విడిచి వెళితే ఆ సంపద అతడి వారసులదే" అన్న హదీసును పేర్కొంటూ, ఈ బాధ్యత ప్రవక్త (సఅసం) ప్రత్యేకతయేనా? లేక ఆయన తరువాత కూడా పాలకులపై ఈ బాధ్యత తప్పనిసరిగా ఉంటుందా? - అన్న ప్రశ్నకు జవాబుగా ఈ బాధ్యత ప్రవక్తకే ప్రత్యేకం కాదనీ పాలకులందరికీ వర్తిస్తుందని అన్నారు.[2]

అలాగే 'అబూదావూద్' (హదీసు గ్రంథం)లో ఉన్న పదాల వల్ల కూడా ఈ బాధ్యత కేవలం ప్రవక్తకే ప్రత్యేకం కాదని అన్ని కాలలలోనూ వర్తించే బాధ్యత అని తెలియ వస్తుంది. హజ్రత్ ముఖ్దామ్ ఉటంకం ప్రకారం, ఓసారి ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ఇలా అన్నారు:

"పసి ప్రాయంలో ఉన్న పిల్లలను ఎవరన్నా వదిలి వెళితే ఆ పిల్లల బాధ్యత

---

1. ముస్లిం- 2వ భాగం.

2. బుఖారి-2వ భాగం.

నాది." ఇంకోసారి ప్రవక్త ఇలా సెలవిచ్చారు: "ఆ పిల్లల బాధ్యత అల్లాహ్, అల్లాహ్ ప్రవక్తది అలాగే ఎవరన్నా సంపద విడిచివెళితే ఆ సంపద వారసులది."[1]

ఈ హదీసులో ప్రవక్త (సఅసం) వాడిన పదాల వల్ల ఈ బాధ్యత కేవలం ప్రవక్తకే ప్రత్యేకం కాదని, ఎల్లప్పుడు అన్ని కాలాలలో పాలకులకు వర్తిస్తుందని తెలుస్తుంది. ఎందుకంటే ప్రవక్త జీవితం ఓ ప్రత్యేక కాలంలోనే పరిమితం. అయితే అల్లాహ్ విషయానికి వస్తే ఆయన ఆరంభం నుంచి అంతం వరకు ఉండేవాడు. కాబట్టి ప్రతికాలంలోనూ పాలకులు అల్లాహ్ బాధ్యతలను స్వీకరించక తప్పదు. అధికారంలో ఉన్నంత కాలం పాలకులు ఈ బాధ్యతను నిర్వర్తించక తప్పదు. ఇదే విధంగా అల్లామా ఇబ్నె తైమియ (ర.అ) ముస్లిం నాయకుల స్థాయి, వారి బాధ్యతల గురించి ఇలా తెలియజేశారు:

"మానవులు దైవదాసులు, పాలకుల స్థాయి అల్లాహ్ తరపున పనిచేసే ప్రతినిధుల వంటిది. వాళ్ళు ప్రజల సంరక్షకులు."

## ఖలీఫాల ఆచరణ

ఇస్లాంకు అనుగుణంగా గడిచిన ఖలీఫాల యుగం భూమిపై దైవ అభీష్టానికి అనుగుణంగా ఇస్లామీయ ఆదేశాల ఆచరణ ప్రస్ఫుటంగా కానవచ్చిన యుగం. ఖలీఫాల ఆచరణా విధానం ద్వారా కూడా ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యతలలో పై అంశం ఉందని తెలియవస్తూంది. ఖలీఫాల కాలంలో పిల్లల గురించిన ప్రభుత్వ విధానాన్ని ఇమామ్ అబూ యూసుఫ్ (రఅ) ఇలా పేర్కొన్నారు.

"పిల్లలకు పుట్టినప్పటి నుంచి..... వంద దిర్హముల సహాయం నిర్ణయించ బడింది. పెరిగి కాస్త పెద్దవాడైన తరువాత అది రెండు వందల దిర్హములు చేసేవారు. యుక్తవయస్కుడైన తరువాత ఈ సహాయం మరింత పెరిగేది.[2]

నేటి ప్రపంచంలో మానవ హక్కులు, బాలల సంరక్షణ అంటూ గొంతు చించుకొనే వాళ్ళు ఎంతమంది ఉన్నారోగాని ప్రపంచంలో ఇలాంటి మరో ఉదాహరణ చూపగలవాళ్ళు ఎవరైనా ఉన్నారా?

---

1. అబూదావూద్-2వ భాగం.
2. ఇస్లాంకా నిజామె ముహాసిల్.

# బాలల సంవత్సరం (1979) సందర్భంగా గీటురాయిలో ప్రచురితమైన వ్యాస పరంపర

## బాలల ప్రాముఖ్యం (9-2-1979)

మానవుని పసికందుకూడా సృష్టి వైచిత్రాలకు ఒక నిదర్శనమే. కల్లా కపటం ఎరుగని దాని రూపంలో ఎంత ఆకర్షణ! అమాయకత్వం ఉట్టిపడే దాని చేష్టలు, చిరుచిరు నగవులు చిందించే మోము వచ్చీ రాని మాటలు, చిన్నారి చిలిపితనాలు, కొంటె పనులు, ఆటపాటలు మన హృదయాల్ని దోచుకొని ఆనందామృతంతో అంతర్యాల్ని నింపని దాని చేష్ట ఏది? అదంతా ఓ మనోజ్ఞ మనోహర లోకం!

మరో విధంగా ఆలోచిస్తే మరో ప్రపంచమే ఇమిడి ఉంది. ఆ చిరు ప్రాణంలో ఏ పిల్లవానిలో ఎలాంటి శక్తిసామర్థ్యాలున్నాయో మనకు తెలీదు. ముమ్ముందు ఆ బాలుడు మానవాళిని ఏ విధంగా సేవించనున్నాడో, ఏ ఘనకార్యాలు సాధించనున్నాడో మనకు ఏ మాత్రం తెలీదు. నేటి ఈ పసివారిలో ఒక రైతు, ఒక వ్యాపారి ఉండవచ్చు. ఒకరు ఇంజనీరు, మరొకరు పారిశ్రామిక వేత్త, ఇంకొకరు పత్రికా రచయిత మరెవరయినా గ్రంథకర్త కావచ్చు. వీరిలో ఎవరయినా బడిపంతులయితే మరో పెద్ద మనిషిలో న్యాయవేత్త దాగి ఉండవచ్చు. వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు, రాజకీయ దురంధరులు పరిపాలనాదక్షులు ఎవరెవరున్నారో ఇప్పుడిప్పుడే ఖచ్చితంగా చెప్పడం అసాధ్యం. కుటుంబం, వంశం, జాతి, దేశం, సకల మానవాళి - వీటిలో దేనికి ఎవరి ద్వారా ఎంత లాభం కలుగనున్నదో కూడా చెప్పలేము.

ఇన్ని శక్తిసామర్థ్యాలు దాగివున్న ఈ శిశువు తన పుట్టుక కాలంలో అత్యంత బలహీనుడిగా, అసహాయుడిగా ఉంటాడు. ఇతని పెంపకం, పెరుగుదలల కొరకు కావలసిన శ్రద్ధ, శ్రమ, ప్రేమావాత్సల్యాలు ఇతర ప్రాణుల పిల్లలకు అవసరం ఉండవు. కాస్తంత అజాగ్రత్త అతని ప్రాణానికే ముప్పు తేవచ్చు.

ఇతని బుద్ధి వివేకాలు, నైతిక ఆలోచనాత్మక శిక్షణ ఇంకా కష్టభరితమైనది. ఈ సందర్భంలో ఏ కొద్ది పొరపాటు జరిగినా అతన్ని అవి పూర్తిగా తప్పుదారి పట్టించ వచ్చు, అతని ఉనికే సమాజానికి ఒక దుర్భర శిక్షగా పరిణమించవచ్చు. కాని సరయిన మార్గాన అతని శిక్షణ జరిగినట్లయితే అతడు సమాజానికి సుఖ శాంతుల్ని ప్రసాదించేవాడుగా తయారవవచ్చు.

సమాజ వికాసంలో ఒక్కొక్క బాలునికి కూడా ఎంతో ప్రాముఖ్యం ఉంటుంది. అతడు ప్రథమంలో తల్లిదండ్రుల కంటి చలువ. వారి మనశ్శాంతికి కారణభూతుడు, వారి ఆశయాలకు ఒక రూపం, వృద్ధాప్యంలో వారికి అండగా నిలుస్తాడు.

కుటుంబంలోని వారు వంశంలోని వారు అతనిపై ఎన్నో ఆశలు పెంచుకుంటారు. దేశానికి జాతికి అతడొక నిధి. అందువల్లనే వారందరూ కలిసి అతని శారీరక పోషణ పెరుగుదలలతోపాటు అతని నైతిక శిక్షణ కొరకు ప్రయత్నించడం వారి నైతిక కర్తవ్యం, చట్టరీత్యా బాధ్యత.

## ఇస్లామీయ శిక్షణలు

ఐక్యరాజ్య సమితి తరఫున 1979వ సంవత్సరాన్ని ప్రపంచమంతటా బాలల సంవత్సరంగా పరిగణించడం జరిగింది. ఈ సందర్భంలో ఇస్లాం సూచించిన ఆదేశాలను అతి క్లుప్తంగా ఇక్కడ సమర్పిస్తున్నాము. ఏ విధంగానయితే జీవితపు ఇతర రంగాలలో ఇస్లాం మానవులకు సన్మార్గం చూపిందో అదే విధంగా ఈ విషయంలోనూ ఆదేశాలు ఇచ్చింది. ఈ బోధల్లో, సాధారణంగా మానవ ఆలోచనా సరళిలో కన్పించే లోటుపాట్లు ఏ మాత్రం కానరావు.

## బాల హత్య నిషేధాజ్ఞలు

మానవుడు తన యావత్తు చరిత్రలో చేసిన అత్యంత క్రూరమయిన అపరాధాల్లో సంతానాన్ని నిర్దాక్షిణ్యంగా చంపడం కూడా ఉంది. అతడు తన

అజ్ఞానం, అవివేకం, మూఢనమ్మకం, తప్పుడు ఆచారాల కారణంగా జుగుప్సాకరమయిన భావోద్రేకాల సంతృప్తికొరకు తన చేతులారా సొంత సంతానాన్ని కడతేర్చి తన కళ్ళారా తన సొంతబిడ్డల రక్తం చూశాడు. పేదరికం, లేమి వచ్చి పడతాయన్న భయం కూడా ఈ కఠోర మనస్తత్వానికి ఒక కారణంగా చెప్పవచ్చు. తన ఆదాయంలో తన సంతానం కూడా భాగస్వామి అవుతుందన్న ఆలోచనతో, సంపాదించే హస్తాలకంటే తినేనోళ్ళు ఎక్కువయిపోతాయని, అతని సొంత అవసరాలు నెరవేరలేవని భావించి నిర్దాక్షిణ్యంగా తన గుండెల్లోని కండరాలయిన తన కన్నబిడ్డల్ని చేజేతులా హతమార్చుకున్నాడు. ఇస్లాం ఆగమనానికి పూర్వం అరబ్బుల అనేక తెగల్లో ఈ ఆచారం చలామణిలో ఉండేది. ఇస్లాం దాన్ని తీవ్రంగా ఖండించింది, ఈ నిర్దయ, కాఠిన్యం, కఠోర మనస్తత్వాన్ని గొప్ప అపరాధంగా పరిగణించింది. భూమిపై పుట్టే ప్రతి ప్రాణి అల్లాహ్ ఆదేశానుసారమే పుడుతుంది. తాను సృష్టించిన చిన్నారి జీవిని ఆకలిదప్పులతో చావనిస్తాడని అనుకోవడం అల్లాహ్ పోషణాగుణాన్ని శంకించడంతో సమానమని ఇస్లాం నొక్కి వక్కాణించింది. ఆయన హస్తాల్లో భూమ్యాకాశాల సకల నిధులున్నాయి. ఆయన మిమ్మల్ని పోషిస్తాడు మరియు మీ సంతానాన్ని పోషిస్తాడని దివ్యఖుర్ఆన్ చాటింది.

> **"బీదరికం ఆవహిస్తుందన్న భీతితో మీ సంతానాన్ని చంపకండి. మేము వారినీ పోషిస్తాము మిమ్మల్ని కూడా పోషిస్తాము. వారిని చంపడం మహాపరాధం." (బనీ ఇస్రాయీల్-31)**

మగ సంతానమంటే కాస్తో కూస్తో భావిలోని ఆశలు వారితోముడిపడి ఉంటాయి. వారు ఉపాధి నముపార్జనలో ముమ్ముందు తోడవుతారనే నమ్మకముంటుంది. శత్రువుల బారినుండి కాపాడుతారని, కుటుంబానికి, వంశానికి శక్తిగా రూపొందుతారని విశ్వాసముంటుంది. కాని ఆ కాలంలో కూడా ఈ కాలంలో మాదిరిగానే ఆడపిల్లల ఉనికే బాధగా, అవమానకారణంగా భావించబడేది. వారు ఆర్థికపరంగా కూడా ఒక బరువే, వారిని రక్షించడం కూడా ఒక సమస్యే. ఇలాంటి కారణాలతో వారిని చంపే ఆచారం బాగా ప్రచారంలో ఉండేది, ఇస్లాం ఈ వైఖరిని తీవ్రంగా విమర్శించింది. ఇంకా రాబోయే ప్రళయ

దినాన అల్లాహ్ ఆ అమాయక పాపను, ఆమె చేసిన నేరమేమిటో, ఎందుకు ఆమె సొంత తల్లిదండ్రులే ఆమెను సజీవ ఖననంచేశారో అడుగుతాడు. అప్పుడు ఆమె తాను నిరపరాధినని, నిస్సహాయికననీ తనపై అత్యాచారం, దౌర్జన్యం జరిగిందనీ ఫిర్యాదు చేయగా ఆ దుర్మార్గులను దైవ శిక్షనుండి రక్షించే నాధుడు ఎవడూ కానరాడని ఇస్లాం తెలుపుతోంది.

ఈ ఘోరపాతకం అధర్మమయిందని, నిషిద్ధమని మహాప్రవక్త తన ఈ ప్రవచనంలో తెలిపారు:

"అల్లాహ్ నిషిద్ధం చేశాడు–తల్లి ఆజ్ఞల్ని జవదాటడం, అమ్మాయిల్ని సజీవ ఖననం చెయ్యడం" దేవతల పేరున సంతానాన్ని బలి చేసే ఆచారం కూడా వివిధ మతాల్లో ఉంటూ వచ్చింది. వాస్తవమేమంటే మతం పేరిట ఇలా అధర్మ ప్రాణబలి స్వయంగా మతాన్ని అవమానించడంతో సమానం. తన ప్రసన్నత బడయడానికి అమాయిక ప్రాణుల్ని హతమార్చమని దైవం ఎక్కడా ఆదేశించలేదు. ఇస్లాం ఇలాంటి మతతత్వానికి ఏ మాత్రం తావివ్వలేదు. ఒక మహిళ హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర.అ.) వద్దకు వచ్చి "నేను సంతానాన్ని బలి ఇస్తానని మొక్కుబడి చేసుకున్నాను– మీరేమంటారు" అని అడిగింది. దాన్ని ఆయన వారించి తన మొక్కుబడికి ప్రాయశ్చిత్తం చేసుకోవొమ్మని ఆదేశించారు.

(ముఅత్తా–అన్నుజూరు వల్ ఈమాన్)

## తల్లిదండ్రుల ఆశలకు అనువైన ఆదేశాలు

ఇస్లాం ఒకవైపున, పిల్లలకు తల్లిదండ్రుల వల్ల జరిగే దౌర్జన్యం నుండి కాపాడింది మరో వైపున సంతానం గురించి తల్లిదండ్రులకు ఉండే సహజమయిన సవ్యమయిన భావాలకనుగుణంగా ఆదేశాలు కూడా జారీ చేసింది, వారి జననం తరువాత సంతోష సంబరాలు జరుపుకునే సంస్కారవంతమైన విధానాలునేర్పింది. ఇంకా వారి పోషణ, శిక్షణల గురించి చాలా వివరమయిన సంపూర్ణమయిన ఆదేశాలూ ఇచ్చింది.

## పుట్టగానే అజాన్ వినిపించాలి

ఇస్లాం ఒక ప్రత్యేకమయిన సంస్కృతిని సృజిస్తుంది, ప్రత్యేక సభ్యతా సంస్కారాలు నేర్పిస్తుంది, వాతావరణానికి ప్రత్యేక రూపునిస్తుంది, దీన్నంతటినీ అది శిశువు జననం తరువాతే ప్రారంభిస్తుంది. శిశువు పుట్టగానే దాని చెవిలో అజాన్ (నమాజ్ కొరకు ఇచ్చే పిలుపు)- మహాప్రవక్త (సఅసం) తన మనుమడు హజ్రత్ హసన్ పుట్టినప్పుడు శిశువు చెవిలో అజాన్ మాటలు పలికారని హజ్రత్ అబూరాఫే తెలిపారు. (అబూదావూద్, తిర్మిజి)

పుట్టగానే అజాన్ వినిపించడంలో చాలా ఉద్దేశాలున్నాయి. ఒకటేమంటే సంతోష సమయంలో అల్లాహ్ నామం స్మరించడం, ఆయన కీర్తిని స్తుతించడం; రెండోది, అల్లాహ్ పవిత్ర నామ స్మరణ ద్వారా వాతావరణాన్ని షైతాను ప్రభావాలనుండి పరిశుద్ధపరచడం, మూడోది పసివాడిని కూడా దైవవిధేయు డయిన ముస్లింగానే తీర్చిదిద్దడం తల్లిదండ్రుల అభిలాష అని దీని మూలంగా ప్రకటించడం; నాల్గోది పిల్లవాని చెవిలో ప్రప్రథమంగా దైవనామ సంకీర్తన, మహాప్రవక్త దౌత్యభావం, మనిషి అల్లాహ్ దాసుడు అనే భావం వినిపించటం. ఈ శబ్దాలు అసంకల్పికంగా పిల్లవాని మనోమస్తిష్కాలపై ప్రభావం చూపెట్టగలవో ఏమో చెప్పలేము.

## తహ్నీక్ చేయించటం

ఈ సందర్భంలోనే సదాచార సంపన్నుడయిన సజ్జనుని ద్వారా తహ్నీక్ చేయించడం కూడా మహాప్రవక్త సంప్రదాయమే (సున్నత్). తహ్నీక్ అంటే, ఖర్జూరపు ముక్క నమిలి దాని తేమను, లేదా తేనె వంటి ఏదయినా తీపు పదార్థాన్ని పసివాడు చప్పరించేలా చేయడం. దీని ఉద్దేశ్యమేమంటే, పిల్లవాని కడుపులో తొలుతపోయే ఆహారం ఎవరైనా దైవభయభక్తులు కల (ముత్తఖీ) మహనీయుని చేత పోవాలనీ ఆయన ఆశీర్వాదం పిల్లవానికి ప్రాప్తం కావాలనీను. మహాప్రవక్త వద్దకు పుట్టిన పసివారిని తీసుకువచ్చి ప్రజలు తహ్నీక్ చేయించేవారనీ మహాప్రవక్త వారిని ఆశీర్వదించేవారనీ హజ్రత్ ఆయిషా (ర.అ) తెలిపారు. (ముస్లిం)

## మంచి పేరు పెట్టాలి

పిల్లవానికి మంచి పేరు ఎన్నిక చేసి పెట్టాలని ఆదేశముంది. దీని మూలంగా అతని పరిచయం సరయిన విధంగా అవుతుంది. అపసవ్యమయిన, అర్థంపర్థంలేని పేర్లు పెట్టడం భావ్యం కాదు. మహాప్రవక్త (సఅసం) బోధించినట్లు హజ్రత్ అబూదుర్దా ఉల్లేఖించారు.

ప్రళయ దినాన మిమ్మల్ని మీ పేర్లతో, మీ తండ్రుల పేర్లతో పిలువడం జరుగుతుంది. అందువల్ల మంచి పేర్లనే మీరు తమకై తమ సంతానానికై ఎన్నుకోండి. (అబూదావూద్)

ఈ సందర్భంలో కొన్ని నిర్దిష్టమయిన సూచనలూ చెయ్యబడ్డాయి, ఉదాహరణకు ప్రవక్తల పేర్లు పెట్టాలి. ఉత్తమమయిన పేర్లు దేవుని ఎడల దాస్యభావం వ్యక్తం చేసేవి. మనుషుల వృత్తులు, గుణగణాల్ని తెలిపే పేర్లు కూడా పెట్టుకోవచ్చు. ధార్మికంగా చెడు అర్థాన్ని చెప్పే పేర్లు పెట్టడం తప్పు. అబూవహాబ్ జష్మీ కథనం ప్రకారం ఒకసారి మహాప్రవక్త ఇలా బోధించారు. మీరు తమ బిడ్డలకు ప్రవక్తల పేర్లు పెట్టుకోండి; అల్లాహ్ అధికంగా ఇష్టపడే పేర్లు; అబ్దుల్లాహ్, అబ్దుర్రహ్మాన్. ఇతర పేర్లలో ఉత్తమమయినవి: హారిస్ (కర్షకుడు) హమ్మా (సంకల్పధీరుడు) లాంటివి. అన్నిటికంటే తప్పయిన పేర్లు: హర్బ్ (యుద్ధం) ముర్ర (చేదు) లాంటివి. (అబూదావూద్)

## అకీకా చెయ్యాలి

సంతానం గొప్పవరం. పిల్లలు పుట్టినపుడు సహజంగానే తల్లిదండ్రులు సంతోషపడతారు. ఈ సందర్భంలో దైవం పేరున జంతువును జిబహ్ (భోజనార్థం ధార్మికంగా వధించడం) చెయ్యడం ఇస్లామీయ సంప్రదాయం. దాన్నే ధార్మిక పరిభాషలో అకీకా అంటారు. ఇది వాస్తవంగా సంతోషంగా సంతాన దేవుని కృతజ్ఞత తెలుపుకోవడమూ సంతోషాన్ని వ్యక్తం చేసుకోవడం. మహాప్రవక్త ఇలా ఉపదేశించారు.

శిశువు అకీకా కారణంగా కుదువవున్నట్టవుతుంది. అందువల్ల 7వ రోజు శిశువు తరఫున ఒక జంతువు జిబహ్ చెయ్యాలి, పాపకు పేరు పెట్టాలి, తలవెంట్రుకలు తీయాలి. (తిర్మిజి)

అకీకా మాంసాన్ని స్వయంగానూ భుజించవచ్చు, బంధుమిత్రులకూ ఇవ్వవచ్చు, బీదసాదలకూ పెంచిపెట్టవచ్చు, సంతోష సమయంలో అనాథలు నిరుపేదలు ఇతోధికంగా లాభమొందాలని ఇస్లాం వాంఛిస్తుంది, అందువల్లనే శిశుజననం సందర్భంలోను తల వెంట్రుకలు తీసి వాటి ఎత్తు వెండి బీద వారిలో పంచిపెట్టడం ఎంతో శుభకరంగా పరిగణించబడింది. హజ్రత్ హసన్ జననం తరువాత మహాప్రవక్త (సఅసం) తన కూతురు ఫాతిమ్మాను ఉద్దేశించి ఇలా సెలవిచ్చారు.

ఇతని శిరోముండనం చెయ్యండి ఆ వెంట్రుకల ఎత్తు వెండి నిరుపేదలకు ధర్మం చెయ్యండి. (తిర్మిజి)

## పిల్లల పెంపకం

తన భార్యా పిల్లల ఖర్చుల్ని భరించడం, వారికి తినడానికి కూడు, తొడగడానికి గుడ్డ, నివసించడానికి నీడ, రోగమొస్తే మందు ఇంకా ఇతర అవసరాల పరిపూర్తికై ఏర్పాట్లు చెయ్యడము మనిషిపై ఉన్న న్యాయబద్ధమయిన, నైతికపరమయిన బాధ్యత. మనిషి తన ఆర్థిక బాధ్యతల్ని విస్మరించడము, తన వారి అన్నపానీయాల ఎడల ఉపేక్షా భావము కనబరచడము, వారిని బీదరికంతోను ఆకలి బాధలతోను నశించిపోవడానికి వదలివేయడము ఇస్లాంలో ఘోరమైన పాపము. మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు.

ఎవరయితే మనిషి సంరక్షణలో ఉంటారో వారిని హతమయ్యేలావదిలి వేసే పాతకం చాలు అతని పరలోక వినాశనానికి! (అబూదావూద్)

మగ సంతానాన్ని ఎంత సంతోషంతో మనిషి పోషిస్తాడో సాధారణంగా ఆడసంతానాన్ని అంత సంతోషంగా పోషించడు. ఇస్లాం ప్రకారము ఆడపిల్లల

పెంపకమే అధికతర పుణ్యప్రదము, పరలోక సాఫల్యకారణం. మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు:

ఎవరికయితే అల్లాహ్ ఆడపిల్లలనిచ్చి కొంత పరీక్షకు గురిచేస్తాడో అతడు వారిని సవ్యంగా పోషంచినట్లయితే వారు అతన్ని నరక బాధ నుండి రక్షణకు మార్గము కల్పిస్తారు. (బుఖారీ)

మరో హదీసులో మహాప్రవక్త (సఅసం) ఎవరయితే ఆడపిల్లల్ని సక్రమంగా పోషించాడో అతనికి పరలోకములో నా సహచర్యం, సామీప్యం ప్రాప్తమవుతుంది అని బోధించారు.

ఎవరయితే ఇద్దరు ఆడపిల్లలనైనా వారి యవ్వనము వరకు సరిగా పోషిస్తాడో ప్రళయ దినాన అతడూ నేనూ ఇలా జంటగా వస్తాము అని ఆయన తన వ్రేళ్ళను కలిపి చూపారు. (ముస్లిమ్)

## పిల్లల ప్రేమ

పిల్లలతో ప్రేమానురాగాలు సహజమయినవే. కాని కొందరు చాలా కఠిన హృదయులు, కఠోర వర్తనులయి తమ పిల్లలతో ప్రేమగా వ్యవహరించరు. కొందరయితే పిల్లలతో హాస్యమాడటాన్ని, ప్రేమా వాత్సల్యాలతో మెలగటాన్ని సభ్యతకు దూరమయిన, శిక్షణ దృష్ట్యా అవసవ్యమయిన విషయంగా పరిగణిస్తారు. అలానే కొందరు, పిల్లలతో అరమరికలు లేకుండా స్వేచ్ఛగా మసలుకోవడాన్ని తమ హోదాకు హుందాకు తగదని కూడా భావిస్తారు. ఈ భావాలన్నీ నిరాధారమయినవి తప్పయినవి. ఇవి మనిషి పాషాణ తత్వాన్ని వ్యక్తపరుస్తాయి. మానవుల శిక్షణ రీత్యా కూడా ఇది ఆరోగ్యకరం కాదు. ఇస్లాం ఈ వైఖరిని తీవ్రంగా ఖండించింది. ఒకసారి మహాప్రవక్త తన మనుమడు హజ్రత్ హసన్‌ని ముద్దాడితే అక్కడే వున్న అక్రఅబిన్ హాబిస్ "నాకు పదిమంది సంతానం. కాని నేను వారిలోని ఎవ్వరినీ ఇంతవరకు ముద్దాడలేదే" అన్నాడు. మహాప్రవక్త వింతగా అతని వంక చూచారు. మనిషిపై కనికరించని వారిని అల్లాహ్ కూడా కనికరించడు అన్నారు. (బుఖారీ)

సర్వసాధారణంగా తల్లిదండ్రుల తరఫున ఆడపిల్లలకు అతి తక్కువగా ప్రేమ ప్రాప్తమవుతుంది. కాని మహాప్రవక్త (సఅసం) తన కుమార్తెలతో ఎంతో ప్రేమగా ప్రవర్తించే వారు. హజ్రత్ ఫాతిమాపట్ల ఆయనకు అసాధారణమయిన వాత్సల్యం ఉండేది. ఒకసారి హజ్రత్ ఆయిషా (ర.అ) (మహాప్రవక్త సతీమణి, విశ్వాసుల మాతృమూర్తి)ని "దైవప్రవక్త అత్యధికంగా ఎవరి ఎడల ప్రేమగా ఉండేవారు?" అని ప్రశ్నించగా ఆమె "ఫాతిమా అంటే ఆయనకు అవ్యాజానురాగం ఉండేది" అని బదులు పలికారు.

ఇంకోచోట హజ్రత్ ఆయిషా, హజ్రత్ ఫాతిమా విచ్చేసినప్పుడు మహాప్రవక్త (సఅసం) ప్రేమతో నిలబడి ఆమెను ఆహ్వానించే వారని, ఆమె చెయ్యి పట్టుకొని దాన్ని ముద్దిడేవారని, ఆమెను తన ఆసనంపై కూర్చోబెట్టుకునే వారని చెప్పారు. సరిగ్గా ఇలాగే హజ్రత్ ఫాతిమా (ర.అ) చేసేవారనీ, మహాప్రవక్త ఆమె ఇంటికిపోయినప్పుడు ఆమె లేచి నిలబడి ఆయనను ఆహ్వానించడానికి ముందుకు వచ్చేదని, ఆయన పవిత్ర హస్తాన్ని పట్టుకుని ముద్దిడే వారని, ఆయన్ని తాను కూర్చున్న స్థానంలో కూర్చోబెట్టేవారని కూడా ఆమె తెలిపారు. (అబూదావూద్)

## సమానంగా వ్యవహరించాలి

అన్నపానీయాల్లో ఇచ్చిపుచ్చుకోవడాల్లో పిల్లల ఎడల ఒకే మాదిరిగా వ్యవహరించాలి. పిల్లల మధ్య విచక్షణ కనబరచడం వాంఛనీయం కాదు. దీని వల్ల వారిలో పరస్పర ఈర్ష్య, ద్వేషం ఏహ్యం, శత్రుత్వం జనిస్తాయి. తల్లిదండ్రుల ఎడల తప్పుడు భావాలు ఉత్పన్నమవుతాయి. మహాప్రవక్త ఈ ప్రవర్తననుండి వారించారు.

దైవానికి భయపడండి, మీ సంతానం పట్ల సమానంగా ప్రవర్తించండి. (మిష్కాత్, బుఖారీ, ముస్లిం)

సంతానంలోనూ ఆడపిల్లలపై మగ పిల్లలకు ప్రాధాన్యం ఇవ్వడం సంకుచితతత్వాన్ని నీచమయిన బుద్ధిని సూచిస్తుంది. ఆడ, మగ పిల్లల్ని ఒకే దృష్టితో చూచి వారి మధ్య సమానంగా వ్యవహరించే వారికి మహాప్రవక్త స్వర్గం ప్రాప్తమయ్యే శుభవార్త తెలిపారు.

ఎవరికి ఆడకూతురు పుడుతుందో అతడు ఆమెను నజీవ ఖననం చేయకుండా, ఆమె పట్ల ఏహ్యంగా ప్రవర్తించకుండా ఆమెపై తన కుమారునికి ప్రాధాన్యం ఇవ్వకుండా ప్రవర్తిస్తే అల్లాహ్ అతన్ని స్వర్గంలో ప్రవేశింపచేస్తాడు. (అబూదావూద్)

## విద్య

ఇస్లాం నిరక్షరాస్యతను, అజ్ఞానాన్ని నిరసిస్తుంది. విజ్ఞాన కాంతి నలువైపులా ప్రసారం కావాలని కోరుతుంది. అందువల్లనే విద్యనభ్యసించడం, విద్యగరపడం రెంటినీ ఎంతో మహత్పూర్వక మయినవిగా ఇస్లాం అభి వర్ణించింది. ధర్మ విషయాల జ్ఞానం పొందడం ప్రతి ముస్లిం విధి అని సూచించడం జరిగింది. హదీసుల్లో పిల్లల విద్య సుశిక్షణల గురించి పలుమార్లు హెచ్చరించడం జరిగింది. ఒక హదీసులో తల్లిదండ్రుల తరఫున పిల్లలకు ఉత్తమ కానుక విద్య గరపడం, వారికి మంచి బుద్ధులు నేర్పడం అని వర్ణించబడింది. మహాప్రవక్త ఇలా సెలవిచ్చారు.

ఒక తండ్రి తన సంతానానికి మంచి విద్యాబుద్ధులకు మించిన కానుక ఇవ్వలేడు. (తిర్మిజి)

సాధారణంగా ఆడపిల్లల విద్య ప్రాముఖ్యాన్ని ఎవరూ గుర్తించరు. ఈ విషయంలో చాలా ఉపేక్షాభావం కనబరుస్తారు కూడా. ఇస్లాం దీని ప్రాముఖ్యం విశదపరచి దాన్ని గొప్పపుణ్యకార్యంగా పేర్కొన్నది. దీనికి ప్రతిఫలం స్వర్గం అని శుభవార్తనిచ్చింది. హజ్రత్ అబూనయీద్ ఖుదిరీ మహాప్రవక్త (నఅసం) ప్రవచించారని తెలిపారు :

ఎవరయితే ముగ్గురు అమ్మాయిల పోషణచేసి, వారికి మంచి విద్యాబుద్ధులు నేర్పి, వారికి పెళ్ళి పేరంటాలు జరిపి, వారి ఎడల సత్ప్రవర్తన కలిగి ఉంటారో అతని స్వర్గం ఖాయం. (అబూదావూద్)

ఇస్లాం, పిల్లలతో ప్రేమగా మెలగడాన్ని కాదనదుకాని ఈ ప్రేమాను రాగాలు అవధులు దాటరాదని తాకీదు చేస్తుంది. అలాగే, ఒకవైపున అది, పిల్లల

పోషణ, సంరక్షణ, విద్యా సుశిక్షణల బాధ్యతవేస్తూ మరోవైపున పిల్లల కొరకు ధర్మాన్ని నైతికతను విస్మరించడం, ధర్మాధర్మాల విచక్షణ లేకుండా వారి కోరికల్ని నెరవేర్చడం కూడదని హెచ్చరించి, ఇలా చేయడం తమను సర్వనాశనానికి గురిచేసుకోవడమేనని తెలిపింది.

> **"విశ్వాసులారా, మీ ధనం, మీ సంతానం మిమ్మల్ని అల్లాహ్ సంస్మరణను విస్మరింపజేయకుండా జాగ్రత్తపడాలి. ఎవరయితే ఈ విధంగా విస్మరణకు గురవుతారో వారే నష్టపడే వారు." (అల్ మునాఫికూన్- 9)**

## తల్లిదండ్రులు లేని వారి సంరక్షణ

తల్లిదండ్రుల అండదండలు కోల్పోయిన బాలల కనీస నిత్యావసరాలూ నెరవేరవు మరియు వారి విద్య, శిక్షణల ఏర్పాటు కూడా సవ్యంగా జరగదు. ఈ కారణం వల్ల వారు సాధారణంగా బ్రతుకు పరుగులో వెనుకబడిపోతారు. వారు తప్పుడు మార్గాలపై పడే ప్రమాదమూ ఉంటుంది. ఇలాంటి బాలల బాధ్యత వారి వారసుల (దగ్గరి బంధువుల) పైవేసింది ఇస్లాం.

(తండ్రిపై మాదిరిగానే) వారి వారి వారసులపై కూడా వారి బాధ్యత ఉంది. తల్లిదండ్రులులేని వారి వారసత్వంలో ధనం లేక ఆస్తిపాస్తులుంటే, వారి సంరక్షణ ఆ ధనం ద్వారా చెయ్యవచ్చు. అయితే ఆ ధనం సురక్షితంగా ఉండేందుకు, అది క్రమేణ పెంపొందేందుకు అవసరమయిన ఏర్పాట్లు కూడా జరగాలి. ఎవరయితే వారి సంరక్షణ, ఇత్యాది విషయాల్లో తమ సమయాన్నీ, శ్రమను వ్యయపరుస్తారో, అలాంటి వారు బీద వారయితే నియమం ప్రకారం వారు తమ శ్రమకు ప్రతిఫలం తీసుకోవచ్చు, కాని స్థితిపరులయితే జాగ్రత్తవహించడమే శ్రేయస్కరం.

తల్లిదండ్రులు లేనివారి సంరక్షకులు ధనవంతులు అయితే వారు ఆ బాలల ధనానికి దూరముండాలి, కాని లేని వారయితే సాధారణ నియమం ప్రకారం అందులో నుంచి ప్రతిఫలం పొందగలరు.

తల్లిదండ్రులు కోల్పోయిన బాలలు నిరుపేదలయితే, వారి వారసులు కూడా వారిని సంరక్షించే స్థితిలో లేకపోతే ముందుకు వచ్చి వారి సంరక్షణా బాధ్యత స్వీకరించమని సమాజం మొత్తాన్ని ఇస్లాం పురికొల్పుతుంది. హదీసుల్లో తల్లిదండ్రులు లేని వారి సంరక్షణ, వారి బాగోగుల విచారణను ఎంతో మహత్పూర్వకమయిన క్రియలుగా పేర్కొనడం జరిగింది. ఒక హదీసులో మహా ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు.

తల్లిదండ్రులు లేనివాడు తనవాడయినా పరాయి వాడైనా అతన్ని పోషించే వ్యక్తి మరియు నేను పరలోకంలో ఇలా ఉంటాము (అని తన రెండు వేళ్ళను కలిపి చూపారు). (ముస్లిం)

ఈ సందర్భంలో ముఖ్యమయిన విషయం ఏమిటంటే తల్లిదండ్రులు లేనివారి అవసరాన్ని తీర్చడం, వారిని నిస్సహాయులుగా వదలివేయకుండా జాగ్రత్తపడటం ఇస్లామీయ ప్రభుత్వపు బాధ్యతల్లోని విషయం. అందువల్ల సమాజంలోని వారు తమ నైతిక బాధ్యతను గుర్తించలేకపోతే ప్రభుత్వం వారిని తన సంరక్షణలో తీసుకుని వారి పోషణా భారాన్ని వహిస్తుంది. మహాప్రవక్త (సఅసం) ప్రభుత్వ అధినేతగా ఒకసారి ఇలా ప్రకటించారు.

ఎవరయినా ఋణాన్ని, చిన్నపిల్లల్ని వదలి మరణిస్తే (వారి సంరక్షణకు ఏర్పాటులేకపోతే) వారు నా వద్దకు రావాలి. నేను వారి సంరక్షణా భారాన్ని వహిస్తాను. (బుఖారీ)

## అనాథ బాలల సంరక్షణ

అనాథ బాలల సమస్య చాలా సున్నితమైయింది. వారి తల్లిదండ్రులెవరో తెలియకపోవడం చేత చట్టరీత్యా వారి పోషణా భారం ఎవరిపై కూడా మోపడానికి వీలుండదు. సమాజం కూడా వారిని అంత తేలిగ్గా స్వీకరించదు. ఇస్లామీయ ప్రభుత్వం ఇలాంటి అనాథ బాలల సంరక్షణా భారాన్ని తానే స్వీకరిస్తుంది. హజ్రత్ ఉమర్ (ర.అ.) ఖిలాఫత్ కాలంలో ఒక వ్యక్తి ఒక బాలుడిని ఎక్కడో పడి ఉంటే

తీసుకొని ఆయన వద్దకు వస్తాడు. హజ్రత్ ఉమర్ (ర.అ.)కు ఆ తెచ్చిన వ్యక్తి మంచి మనిషి అనీ నమ్మకస్తుడనీ తెలుస్తుంది, ఆయన ఆ వ్యక్తికే ఆ బాలుని పోషణ అప్పగిస్తారు, అందుకయ్యే ఖర్చు ప్రభుత్వం భరిస్తుందని తెలుపుతారు. (ముఅత్తా)

ఎవరికయినా, ఎక్కడయినా ఒక బాలుడు కాని బాలిక కాని అనాథగా దొరికితే అతన్ని చేరదీయడం ఉత్తమం అనీ, పుణ్యప్రదమనీ తెలిపారు; ఇంకా, అతన్ని అలాగే వదలి వేయడం హానికరమయిన పక్షంలో చేరవేయడం ధర్మమవుతుందనీ తెలిపారు. (హిదాయ)

బాలల గురించి ఇస్లాం బోధనల ఈ పరిచయం వల్ల తెలిసిందేమంటే ఇస్లాం ప్రకారం బాలల పోషణ, రక్షణ, సంరక్షణ, సుశిక్షణల బాధ్యత తల్లిదండ్రులు, కుటుంబం వారు సమాజం చివరికి ప్రభుత్వంపై కూడా ఉంది. ఇస్లాం వీరందరినీ వరసగా బాధ్యులుగా నిర్ణయిస్తుంది. ఈ బోధనలపై నిజాయితీగా అమలు జరిగితే బాలల భౌతిక, నైతిక అవసరాలు పూర్తి అవుతాయి. వారి ఆరోగ్యవంతమయిన పెంపకమూ జరుగుతుంది. వారు దైవభక్తులుగా, సద్గుణసంపన్నులుగా ఆదర్శ నాగరికులుగా, మానవాళికి ఉత్తమ సేవకులుగా రూపొందుతారు.

-: సమాప్తం :-